శ్రీరామచంద్ర.

# చ ం ద మా మ

1. పిల్లలక్కొఱ ముద్దుఘోరక్క్రి ♦ దల్లిచెంత
జాదురుని జందమామ యు ♦ టందురెప్పుడు

౩. పాలకడలికి ముద్దుల ♦ పట్టి యనిన
సిరులనిచ్చెడు చెలువ పో ♦ దరుఁ డటన్నఁ
దేవుచే కువలయ మేలు ♦ రాజటన్నఁ
జందమామకుఁ డీటురా ♦ డందు మేము.

౪. ఉగ్గుపాలను ద్రాగుచు ♦ నున్నయపుడె
తల్లిచే విన్నదగుట జా ♦ బిల్లిపదము

4

చందమామకు సరిపడు, ♦ నింగు నొక్కు
మాకు జాబిల్లి యనఁ జంద ♦ మామ యనిన.
5 శశధరుం డన్న నీచోక్తి, ♦ జాబిల్లి
యన్న శేషోక్తి, తిప్పు ♦ శాముఁ డన్న,
సరిపడదు మాకు నీవిలోఁ ♦ జందమామ
యనియు, జాబిల్లి యనియు నే ♦ మందు మెప్పుకు

ఆపనియు, నీపనియుఁ జేయ ♦ నక్షత్ర [?]
దినము గడచెను; రాత్రి యే ♦ తెంచె నక్షత్రము [?]
మిన్ను నీలపటంబు నాఁ ♦ జెన్ను మీఱెఁ
జలువలనుజిమ్ము పున్నమ ♦ చందమామ
నిండుకళల విరాజిల్లు ♦ చుండెఁ; జుక్క
లొక్కటొక్కటిగాఁ దోఁచు ♦ చుండెఁ; గనుల

పండువుగఁ బాడువెన్నెల ♦ నిండియుండె;
నఖిలజగము సుధామయ ♦ మైనయట్లు.

8. మెల్లమెల్లగ మలయస ♦ మీరణుండు
తలిరుగొమ్మల మీఁదుగాఁ ♦ దాఁచుచుండె;
నేచివురుగొమ్మ నుండెనో ♦ యెవరి కెఱుక!
కోయని వసంతకోకిల ♦ కూయుచుండె.

9. వేడుకలఁ గూర్చుచల్లని ♦ వెన్నెలలను,
హాయినొసఁగూర్చు మందమం ♦ దానిలముల,
లలితగతి మీరుకోకిలా ♦ లాపములను,
గోరక చరించువార లు ♦ న్నారె జగతి?

10. ఆరుబైట వెన్నెలకుప్ప ♦ లాడువారు,
కోకిలమతంబులకు మారు ♦ గూయువారు

కల్లపాదులఁ గల్పించి ♦ కాయఁజేసి
గుమ్మడులఁ జిక్కుడులఁ జాలఁ ♦ గోయువారు;
తత్తరంబున వెన్నెల ♦ వత్తి విడి
తెచ్చి యిచ్చినవారల ♦ మెచ్చువారు;
చిట్టిమిరియంబులును, ♦ జిప్పచిప్పగోళ్లు
చెమ్మచెక్కలు నాడిహా ♦ ళించువారు;

12 నగుచు లిక లాపేశ ♦ నగుచు నగుచు
నిరుజ్జ్వలగ నాటల ♦ నాడికొనిరి;
తార యీబాలికలతోడ ♦ జేరియుండి;
నీమె ముద్దులచెల్లెలై ♦ దోడ్త లలిత
13 ,,అక్క నన్నేల గొనిపోవ ♦ దయ్యె,, ననుచు
పిఖిగున్నముదాక వె ♦ న్వొంటఁ దవిలి,

కనుమొఱంగినసోదరిఁ ♦ గానలేక
వెనుదిరిగి తల్లికడ కేగి ♦ వెక్కి-వెక్కి
మున్ను చెప్పిన వినకుండ ♦ నేడ్చుచుండఁ
బోరుపెట్టిన బాలిక ♦ బుజ్జగించి
లీల నొక మైఁడిగిన్నెలోఁ ♦ బాలు వోసి
గుజ్జుబువ్వను గలిపి యాఁ ♦ కూఁతు నెత్తి

15. చంక నిడికొని వాకిటను జాదమామను
జూపి యమ్మాతల్లి! జాబిల్లిఁ జూచినావె!
అమ్మ బువ్వకుఁ బిలిచిన ◆ యంతలోన
పరుగుపరుగునఁ జెంతకు ◆ నరుగుదెంచు.

16 తగవుబెట్టక బంగారు ◆ తండ్రిలాగు
బొజ్జనిండఁగఁ దిని యాడఁ బోవునమ్మ!

తల్లితో మారమును సేయ । వెల్లి వేళ
వల్లరులఁ జేయు కాలువ ◆ నాఁడు మోదము,

17. మంకుపిల్లలఁ గూడకుము; ◆ మంచివారిఁ గూడు;
బుద్ధిమంతుఁడు కొండ్ర ◆ గొప్పవంతుఁడు;
చల్లఁదన మిచ్చు; వెన్నెలఁ ◆ జాలఁ గిచ్చు;
నేను నాతల్లి! నినుఁ జూచి ◆ నాఁ డింతును.

పైఁడిగిన్నియలో నున్న    పాలబువ్వ
నించు కించుకగా నార । గించుమాండె—
20 “అమ్మరో! గిన్నెలోనిది । యయ్యొ; నాదు
కడుపులో నున్నదల్లని ♦ కాకిపిల్ల
పొట్ట నింకంగఁ విని పోయె ♦ బువ్వ మెల్ల;
బలుకుచున్నది చల్ల ♦ బాలుఁ డాపి.

21 నేల నొకచుక్క మైనను ♦ రాలకుండ
ద్రాగితిని పాలు బంగారు ♦ తల్లిలాగు;
తల్లి! జాబిల్లి యుల్లరి ♦ పిల్లవాఁడు;
బువ్వ! నేరీతిగా నెల్లఁ ♦ బోసికొనను?
22 వేగ నాబువ్వఁ దిని పొద్దు ♦ వేసినాను
చందమామపై; నోయమ్మ! ♦ ముందు నా ము

6

కడుపులో గాకిపిల్లవే ♦ గంతుసై చే;
కలదుగా జోలు సీలని ♦ కడుపులోనం

23 జన్నదగు కాకిపిల్ల; లే ♦ కున్న వతని
యొడలిలో నల్పు గాన్పించు ♦ చున్న దేమి?
అమ్మ! యీచిన్ని జాబిల్లి ♦ కమ్మ యెవరు?
ఈలిసికి బువ్వపెట్టావా ♦ రెవ్వ రమ్మ!

24 అక్క నాకంటె నీతని । కక్క గలదె?
ఇతనితో నాకు గానకుండ । నెవరికి కేన?
పోరుపెట్టఁడె కొంతపైఁ । బోవలేక?
భయము వేయదె క్రిందికిఁ । బడును యేమొ?

25 రాత్రిరైనను నింటికి । రాక బయలఁ
జెల్లవాటినదాఁకను దిరుగు నేమి?

ఎవరుపిల్చిన వారితో ♦ నేగి వారి
తోడఁ గూర్చుండి యెంగిలి ♦ కూడు దినవె!,,
౩౦ అనుచు నవ్యక్తమధురోక్తు ♦ లాడుచుండ
జనని ప్రియమంది లలిత న ♦ ర్తన గిదించి
చల్లగా నుత్తరంబులో ♦ సాగుచుండ
నాడఁబోయిన రారయు ♦ నరుగుదెంచె.

27. తారహృదయంబు మెత్తన; • తారకెపుడుఁ
జందమామను జూచుట • చాల ప్రీతి;
పగలు జాబిల్లి రాక యే • మగును గాని
తారయును మింటిపైఁ జూడ్కిఁ • దేరనీదు.

28 ఎపుడు సూర్యుఁడు గ్రుంకునో? • యెపుడు గోవు
లిండ్లకయి వచ్చుచుండునో? • యెపుడు పసు

తెల్ల గూండ్లకు జేసునో? ♦ యెవ్వరు మింట
నెట్టగాఁ ద్రోయుచుండునో, ♦ యెవ్వరు రేయి
29 యరుగుదెంచును, తారయు ♦ నవ్వు చుక్క
చందమామను జూచెను ♦ సంభ్రమమున
నింగి నిరువంకలను దాంగి ♦ తొంగి చూచెను;
వెన్నెలబయళ్లలో నాట ♦ లన్ననామి

రమ్యతరమైన నీలాంబ  రంబునందు
చల్లగాఁ గూరుచున్నాఁడు ◆ చందమామ.
పొంకపు నెలవాఁ డొసంగిన ◆ పోగులెల్ల
నెత్తికొని వెండిపూఁతఁబూ ◆ యుంచె నేము
చందమామకు నను వెంచి ◆ జాలి రుంచె;
నక్షు లరమోడ్చి కనుఁగొను ◆ చల్లయుపినా!

36. బాలికామణుల్ వెన్నెల ♦ వత్తు లనియుఁ
ప్రౌఢలగు సుందరులు నెల ♦ వంక లనియు
వనితలం దఱుఁ జందురు ♦ వంక లనియు
ననెదరవి చందమామఁ బు ♦ ట్టించవి కావె?

37. వరిగఁ బదియేనుదినములు ♦ చందమామ
క్రమముగా సంజకే వచ్చుఁ ♦ గాని, వెనుక

నొకట నాలస్యముగ వచ్చు ♦ చూడి యుండి
యేము నిద్రించుదాఁక రాఁ ♦ డేమొ తుదకు?

౩౮. ఆఁడుబిడ్డ లొప్పులకుప్ప ♦ లాడు వేళ
గల్లుగల్లనువద్దాల ♦ గాజులందు
నిలిచి కన్నుల మిరుమిట్లు ♦ గొలుపుచుండు
చందమామకు నది యేమి ♦ సంబరంబా?

39. ఆటసందడిలో నున్న ♦ యట్టివేళ
చెట్లకొమ్మలసందుల ♦ చెంతఁజేరి
ఆకినచిగుళ్లలో మంచు ♦ నీరు వ్రాసి
యెన్నియోముత్తియములఁ గా ♦ యించుచుండు.

40. ఆటలో నోడిపోయిన ♦ యట్టివారిఁ
దెల్లవోయినవారంచు ♦ దెప్పఁబోవ

చిన్ని వెన్నెల నెల్లరఁ ♦ జిన్నబుచ్చి
తెల్లవోయినవారలఁ ♦ దెలియనీఁడు.

41. కొండపై నెన్ని చుక్కలో ♦ నిండియుండ
దినమునకు నొక్కచుక్కయేఁ ♦ దిరుగుఁగాని
« యాడుకొనరారా! జాబిల్లి!,, ♦ యనుచుఁ బిల్ల
లెంత పిలిచిన దిగిరాఁడ ♦ దేమి భయమొ?

42. సరిగ తేఁజిగురాకుల ♦ సందులఁదు
నెన్నియో వెండిపూలఁ బూ ♦ యించుచుండెఁ
గనుమలపి చూడ మింటికిఁ ♦ గంటి కొంకఁపు
వెండితీఁగ లెన్నెన్నొ క ♦ ల్పించుచుండు.

43. అంటఁగా ముట్టఁగా రాని ♦ యట్టిచోట
నిలిచి దాఁగిలిమూఁతల ♦ నెఱపుఁ గాని,

ఈడుజోడైనవారితో ♦ నాడుకొనఁగ
జతలుఁగూడ డిదేమొకో ♦ చందమామ.

44. ఒక్కమాటుగఁ దెరచాటు ♦ నుండివచ్చు
భామవేషంబువలె మబ్బు ♦ ప్రక్కనుండి
చటుకుమని వచ్చుచుండు ♦ చందమామ
యీతనికి నింతయొయ్యార ♦ మెందుకొ ఆణా?

**45.** చందమామ యదేమొ కా ♦ సారవారి
పూరములలోన మాటికిఁ ♦ దాచుచుండు?
మఱచితిమి కవితావేశ ♦ పరవశతను
కలదుగా యట వలపించు ♦ కలువకన్నె!

**46.** తుమ్మెదలఁ గాంచి గీతమా ♦ధుర్య మెంచు
మల్లెపూవులఁ గలపరి ♦ మళముఁ గాంచు

వాయునందనుశాఁ జేను ♦ చేయిఁ గలపు
సరసనుకుమారంబలుఁడు ♦ మాచందమామ!

47. నింకుగా నెక్కినాఁడు గా ♦ న్పించినంత
నెవరిదుష్టులు తాఁకునో ♦ యేమొకాని
నాఁటినాఁటికిఁ గృశియించి ♦ పాటిదప్పి
తిరిగి నెలనాళ్లదాఁకను ♦ తేరుకొనాఁడు.

48. ఎలమి నంతఃపురంబుల ♦ కెగయఁ బ్రాఁకి
ముంగిటి గవాక్షములఁ దొంగి ♦ తొంగి చూచుఁ
దేరి చూచిన మిన్నెక్కి ♦ కూరుచుండుఁ
దుందుడుకుబాలకుఁడు గాఁడె ♦ చందమామ.

49. లలితకరకిరణముల జా ♦ లంబు లల్లుఁ
దోయనిధివీచికలలోనఁ ♦ దూఁగి యాడు

మబ్బుతోడలపై నెక్కి ♦ మాయ మగును
జాలకుల చెన్నొఁగన నేము ♦ చందమామను.
చందమామనుగను టింత ♦ సంబరంబొ
సలిలకలశంబు చెప్పఁగాఁ ♦ జాలకున్నఁ
బాలఁగనినమాత్ర నుప్పొంగి ♦ పోవుచున్న
కలశవారాశిఁ గనినైనఁ ♦ దెలిసికొనుఁడు.

51 తెల్లనగుకాగితముమీఁద ◆ఁ దిరిగితిరిగి
కలము గంతులువేయంగఁ ◆ గలదుగాని
నల్లనగునింగి నల్లన ◆ నడచుచున్న
చందమామను వ్రాసి మె ◆ ప్పొందఁగలదె?



